# "PRAJALA KADHA"

( PEOPLES' STORY )

A Poetical work of Civics, on Merits and Demerits Peoples' Democracy, by

Vangapandu Appalaswamy, M.A., (Tel) M.A., (Pol) B.E

Prajakavi - for enlightening the ordinary Public on Civic

FOREWORD BY

ACHARYA SRI MAMIDIPUDI VENKATA RANGAYYA

Retired Professor of Politics Bombay and Andhr Universities and an eminent contemporary Historian Secunderabad, Andhra Pradesh

Published by the Manager, Vanisree Publications,
Parvatipuram, Vizianagaram Dt.

ప్రథమ ముద్రణ : 1984



ప్రతులకు :
మేనేజర్,
వాణిశ్రీ పబ్లికేషన్స్,
పార్వతీపురం.

ముద్రణ :
శ్రీ కృష్ణా పవర్ ప్రెస్,
విజయనగరం-2.

వెల : రూ. 5/-

# PRAJALA - KADHA

( PEOPLES' STORY )

# DEDICATED

TO

**Sri Pusapati Ananda Gajapathi Raju, M.A.,**

Noble son of Maharajah of Vizianagaram

&

Hon'ble Minister for Education

Government of Andhra Pradesh

who is immensely respected and elected by the people and whose Administration is like "Philosophic Rule" as defined by the "Plato", the Greatest Political Philosopher.

AUTHOR,

**Vangapandu Appala Swamy,**

PARVATHIPURAM.

# DEDICATED TO



Honourable Sri P. ANANDA GAJAPATHI RAJU, M.A.,
Minister for Education, Andhra Pradesh.

# అంకితం

# ప్రజల కథ

(ఖండ కావ్యం)

## కృతిపతి

### శ్రీ పూసపాటి ఆనందగజపతిరాజు

ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు
విజయనగర సంస్థానాధీశులు

ధన స్వామ్యానికి కాలం కాదని
జన స్వామ్యానికి ప్రాణమిల్లిన
జనాదరణ ప్రేమాన్విత జనపతి
పూసపాటి శ్రీ ఆనంద గజపతి
ప్రజాస్వామ్య సామ్యవాది
ప్రజ్ఞానిధి ప్రజా ప్రతినిధి
విద్యలను పోషించే-విజయనగర సంస్థానాధీశులు
మన రాష్ట్ర విద్యాశాఖామాత్యులు-రాణించునిక విద్యలు
అధికారం-ఔదార్యం పూసపాటి రాజులలో పుట్టుకతో వచ్చినవె-
వేతలనుచు - దాతలనుచు - ప్రజలందరు మెచ్చినవే -
రాచరికపు సిరినొల్లని — రాజకుమారుడు, ధీరుడు
సామ్యవాద సరణిలో-తండ్రికి మించిన తనయుడు
ప్రతిభకు ప్రతీక మీరని
తాత్విక పాలనకు తగుదురని
జొప్పించితి-"రాజనీతి"
అర్పించితి-అందుకొనుడు
—రచయిత.

# విజ్ఞప్తి

ప్రజాస్వామ్యము నందలి గుణదోషాల్ని పదేండ్లు పాఠ్యాంశంగా కళాశాలలో ప్రభోదించాను.

సామాజిక ప్రయోజన మొక ధ్యేయంగా జన సామాన్యానికి కూడ పౌరవిజ్ఞాన మందించే భాగంగా, నా యీ ప్రజల కధను కథా చిత్రంగా మలచి, కవితా రూపకంగా తీర్చి దిద్దాను.

సమకాలీన చారిత్రక రాజనీతి విజ్ఞాన ఖని ప్రొఫెసర్ శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్యగారు తొలిపలుకును సమకూర్చడం నాకెంతయిన గర్వకారణం.

నా యీ "ప్రజల కథ"ను స్వీకరించి, సహృదయంతో, నన్నెంతగానో ఆనందపరచిన నా కృతిపతి-శ్రీశ్రీశ్రీ పూసపాటి ఆనంద గజపతిరాజు, విజయనగరం సంస్థానాధీశులు, రాష్ట్ర విద్యాశాఖామాత్యులు, వారికి నా మనఃపూర్వక కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను.

రచయిత

# తొలి పలుకు

ఆచార్య
**మామిడిపూడి వెంకట రంగయ్య**
ప్రొఫెసర్ ఆఫ్ పాలిటిక్స్
జాంబే, ఆంధ్రియూనివర్సిటీస్
**సికిందరాబాద్.**

రాజనీతి శాస్త్రంలోను తెలుగులోను ఎం.ఎ. పట్టభద్రులై కళాశాలలో రాజనీతి శాస్త్రోపన్యాసకులైన శ్రీ వంగపండు అప్పలస్వామిగారు ప్రజల కథ ఖండకావ్యాన్ని రచించి తద్వారా ప్రజాస్వామ్యమంటే ఏమిటో, అందులోని తత్వం ఎలాంటిదో - ఆ పరిపాలనా విధానంలోని గుణదోషాలు ఎలాంటివో - ఏలాటి పరిస్థితులలో అది ప్రజల శ్రేయోభి వృద్ధికి సాధనం కాగలదో బహుచక్కగా వివరించారు.

నేను ఒక రోజంతా ఈ కావ్యాన్ని చదివి, ఇది చాలా విలువగల కావ్యమని, అభిప్రాయపడి ఈ తొలిపలుకును వ్రాసినాను. నావలెనే తక్కిన పాఠకులందరు దీనిని చదివి చక్కగా అర్థం చేసికొని ఉత్తేజితులు కాగలరని విశ్వసిస్తున్నాను.

ఇట్టి ఉత్తమ కావ్యాన్ని రచించిన శ్రీ వంగపండు అప్పలస్వామిగారు తప్పక ప్రజల ప్రశంసలకు పాత్రులు కాగలరని నేను భావిస్తున్నాను.

పాలకులు - పాలితులు అనే విభేధం ప్రతి రాజకీయ వ్యవస్థలోను కనిపిస్తుంది. ప్రజాస్వామ్యంలో కూడ ఉంటుంది- ఉండటం కూడ అవసరం. ప్రజాస్వామ్యం అంటే ప్రజలే పాలకులుగా నుండు వ్యవస్థ అని అనుకోనడం పొరపాటు-ప్రతి రాజ్యంలోను - ప్రజాస్వామిక రాజ్యంలో కూడ - శాసనాలను చేయడం చేసిన శాసనాలను అమలు పరచడం, శాసనాలను ఆధారం చేసికొని న్యాయ విచారణ చేయడం అవసరం. రాజ్యం ఏదో ఒక నగరానికి మాత్రం పరిమితమైనప్పుడు - ఈ శాసనాలను ప్రజలే, ఒక సభలో సమావేశమై నిర్వహించడం కొంతవరకు సాధ్యం కావచ్చు. కాని అలాంటి నగర రాజ్యాలు ప్రాచీన కాలంలోనో, మధ్యయుగంలోనో, గ్రీకు వంటి కొన్ని దేశాలలోనో మాత్రమే ఉండేవి. ప్రపంచంలోని తక్కిన దేశాల లోని రాజ్యాలు విశాల ప్రాంతాలుగ వ్యాపించినట్టివి. అందు చేత వాటిలో ప్రజలందరు సమావేశమై పరిపాలనా కార్య కలాపాలను నిర్వహించడం సాధ్యం కాని పని. కావుననే రాజు సలహాదారులైన మంత్రివర్గం కూడుకొని వాటిని నిర్వహించే సాంప్రదాయం ఏర్పడింది.

కాని కాలక్రమేణా రాజ్యాన్ని పాలించే రాజులలో అనేకులు నిరంకుశులై ప్రజల హితాన్ని విస్మరించి ఏవో కొన్ని వర్గాలకు చెందిన వారిని మాత్రమే చేరదీసి - సామాన్య ప్రజలను పీడించి పన్నులను వసూలు చేసి, ఆదాయాన్ని తమ తమ సుఖాలకు, తను బంధువుల సుఖాలకు, తాము చేరదీసిన వారి సుఖాలకు వినియోగించడం పరిపాటికాగా, ప్రజలు విప్లవాలను లేవదీసి రాజులపై తిరుగుబాటు చేసి తాము ఎన్ను

కొన్న వారినే పరిమిత కాలానికి పరిపాలకులుగా జేసే విధానం ఏర్పడింది

ప్రజాస్వామ్యం అంటే ప్రజలే పాలకులుగ నుండు వ్యవస్థఅని అనుకొనడం పొరపాటు. ప్రజాస్వామ్యం అంటే ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులు పాలకులుగా వ్యవహరించే రాజకీయ వ్యవస్థ. ప్రజలే పరిపాలకులుగా ఉండే వ్యవస్థకాదు. ఈ విషయాన్ని అందరూ గ్రహించవలసి ఉంది. దీనిని రాజనీతి విజ్ఞాన శాస్త్రోపన్యాసకులు, ప్రజాకవి శ్రీ వంగపండు అప్పల స్వామిగారు తన ప్రజా కథ ద్వారా బహు చక్కగా స్పష్టం చేసారు.

ప్రజలలో ఇప్పటివరకు అనేక భేదాలు, కుల భేదాలు, వర్ణ భేదాలు, ఉంటున్నవి. ఒక వర్గానికి మేలు చేకూర్చే విధానం, ఇంకొక వర్గానికి హాని కలుగవచ్చు. అందుచేత ప్రతి ప్రజాస్వామ్యంలో రాజకీయ పార్టీలు కొన్ని ఏర్పడటం, ఎన్నికలలో అభ్యర్థులను నిలబెట్టడం - వారి విజయానికి కృషి చేయడం - ఏపార్టీ అధిక సంఖ్యలో మెజారిటీ సంఖ్యలో విజయాన్ని సాధిస్తుందో అది తిరిగి ఎన్నికలు జరిగే వరకు పరిపాలనాధికారాన్ని నిర్వహించడం ప్రతి ప్రజాస్వామ్యంలో కనిపించే ఇంకొక లక్షణం.

దీని ఫలితముగా అధికార పక్షమని, ప్రతి పక్షమని దేశములోను, శాసన సభలలోను ఉండటం మామూలు. రాజకీయ పక్షాలు లేని ప్రజాస్వామ్యం ఎక్కడా లేదు, ఉండ బోదు. కమ్యూనిష్టు దేశాలలో ఒకే రాజకీయ పక్షం ఉంటుంది.

ప్రతిపక్షాలు ఉండటకు వీలు లేదు. ఇది ప్రజల స్వేచ్ఛకు భంగకరం. తమ యోగక్షేమములను వృద్ధిచేసికొనుటకు, పౌరులందరికి స్వేచ్ఛ ఉండటము -అందుకుగాను వారు వివిధ రాజకీయ పక్షాలుగా ఏవ్యవస్థలో సాధ్యపడుతుందో అదే ప్రజా స్వామిక వ్యవస్థ. పౌరుల స్వేచ్ఛకు ఇది ఒక ప్రధాన లక్షణం. మనది ప్రజాస్వామిక రాజ్యమనే పేరునకు అర్హమైనట్టిది. శ్రీ అప్పలస్వామిగారు వారి ప్రజల కథ కావ్యంలోని ఒక ప్రకరణములో ఈ వివరణను స్పష్టం చేసారు.

కాని అధికార వ్యామోహం ఒక్కటే రాజకీయ పక్షాలకు గాని, రాజకీయ నాయకులకుగాని ధ్యేయం కాకూడదు. అధికారాన్ని సంపాదించుటకు ప్రయత్నించుటలో ఎలాంటి దోషము లేదు కాని దానిని ప్రజల హితానికి గాను వినియో గించక, స్వార్థానికి వినియోగించుటయే దోషము.

ఒక్కొక్కప్పుడు అధికారాన్ని కాంక్షించేవారు కుతంత్రాలు పన్ని మిత్రభేదానికి లోబడి అర్హులైన నాయకులను కూడ అధికారం నుండి తొలగించి రాజకీయ అస్థిరతను కలిగించడం కద్దు. ప్రజాస్వామ్యములోని దోషాలలో ఇదొకటి. ఇది ఎంత ప్రమాదకరమైనదో దాని మూలంగా ఎలాంటి అనర్థాలు సంభవించగలవో తన ప్రజల కథ ద్వారా శ్రీ వంగపండు అప్పలస్వామిగారు తేటతెల్లం చేసారు. తన కావ్యం ద్వారా ఇంతటి మహత్తర సామాజిక ప్రయోజనాన్ని సాధించిన శ్రీ వంగపండు అప్పలస్వామిగారు నిజంగా అభినందనీయులు.

మానవునిలో ద్వంద్వ గుణాలు సహజంగా ఉంటున్నవి. కాని ఉత్తముడు సాధ్యమైనంతవరకు వీటిని అధిగమించి స్వార్ధ రహితంగా ప్రవర్తించుటకు ప్రయత్నిస్తాడు. ప్రజాస్వామ్యంలో ఈ లాంటి వారి సంఖ్య ఎక్కువగా ఉండటం అవసరం. లేని పక్షంలో దేశంలో అరాచకం, అస్థిరత, ఆందోళనలు వ్యాపించడం తప్పదు. అందుచేతనే ప్రజలు సమైఖ్యత, ప్రధానంగా మౌలిక విషయాలలో పక్షపాత రహితంగా అందరూ కలసి కృషి చేయడం అవసరం. ఈలాంటి సమైఖ్యత ఏర్పడినప్పుడే ప్రజాస్వామ్యం ఫలప్రదం కాగలదు. ఈ విషయాన్ని శ్రీ అప్పల స్వామిగారు తన ప్రజల కథ ద్వారా ప్రతి ఒక సాధారణ చదువరికి అర్ధమయ్యేలా సరళమైన భాషలో సుమధురంగా స్పష్టపరచి విపులీకరించారు.

ప్రజల కథ కావ్యంలో శ్రీ అప్పలస్వామిగారు వివరించిన విషయాలలో ఇవికొన్ని మాత్రమే. ఇవిగాక ప్రజాస్వామ్యానికి సంబంధించిన అనేక విషయాలను తన కావ్యంలో ప్రస్తా వించారు అందుచేతనే ఇది ఒక ఉత్తమ ఖండకావ్యంగా నేను భావిస్తున్నాను. ప్రజల కథను రచయిత అతి సామాన్యులు కూడ వింటే అర్ధం చేసుకొనుటకు తగినట్లు సులభశైలి తెలుగు భాషలో,సంభాషణా పద్ధతిలో రచించడం ఎంతైనా ముదావహం. ఇది కావ్యంలో ప్రశంసింప దగిన సుగుణాలలో ఒకటి

జన సామాన్యానికి పౌర విజ్ఞానము గురించి ప్రజలను ఎంతగానో ఉత్తేజపరచగల ఈలాంటి కావ్యాన్ని అందించి నందుకు నేను శ్రీ వంగపండు అప్పలస్వామిగారిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను.

(సం॥) మామిడిపూడి వెంకట రంగయ్య

## ఇందులోని విషయం



## ఇందులోని పాత్రలు – పార్టీలు

1. రాజుగారు : శిష్ట జన పార్టీ
2. బ్రహ్మయ్య : కర్షకుల పార్టీ
3. పుల్లయ్య : శ్రామికుల పార్టీ
4. ఎల్లయ్య : స్వతంత్రుడు
5. రామయ్య : ప్రగతి జన పార్టీ
6. వెంకయ్య : స్వతంత్రుడు
7. సూరయ్య : దీన జన పార్టీ

సూచిక : ఇందులోని పాత్రలు, పార్టీల పేర్లు కేవలము కల్పితాలు. ఏ ఒకరిని – ఏ ఒక పార్టీని ఉద్దేశించి వ్రాయబడినట్టివి కావు.

రచయిత.

# ప్రజల కథ

## 1వ ప్రకరణం

## ఉపోద్ఘాతం

శ్రీకరమగు రీతిని యీ!
లోకమునకు తెలియబడగ, లోకులు మెచ్చన్!
కాకమ్మ కథల నల్లక!
తూకంబగు ప్రజల కథ ను తొల్త వచింతున్! 1

అనగనగ రాజు : అవనిలో నతని గనుము!
ప్రజల నెల్లను బాలించు ప్రభు నతండు
దైవ ప్రతినిధి రాజు ను తీరు దలచి
రమ్యమన దెల్పుదును, నేడె రాజు కథను! 2

చాలు పోవయ్య నీ కథ సంతకెల్ల!
పాత కథనేల జెప్పెద, రోత మాకు!
నేటి ప్రభువులు అయ్యాలె తెలియదేమి!
రాజులిక లేరులేరని రాయవేమి? 3

ఏమి జనులార మీరీతి ఎంతవింత?
అయ్యలకు రాజ్యమేలెడి యర్హతేది?
భూమిపతి యన్న మాటకు రామిలేదు!
ధరను శాసించగలది ధరాధిపతియె! 4

జ్ఞానమా లేక నిసుమంత చదువురాక!
ప్రజను పాలించగలిగెడి ప్రతిభలేక!
పరుల పీకల గోయగ పరుగులెత్తె,
రామయల, కిష్టయల, కథ రాయనేల? 5

ఎచట సంపద విజ్ఞత ఏకమగునొ!
అచట కధికారమేగును, అనగ వినమె!
సంపద హుళక్కి, విజ్ఞత బండిసున్న
రామయకు, కిష్టయకు, రాజ్యపాలనేల? 6

ప్రజను శాసించు, వ్యక్తుల కథలు గలవు!
వ్యక్తులను, నడుపు జనగాథలెన్ని గలవు?
పాలనొక కళ ప్రతివానికబ్బునయ్య!
అయ్యలకు మంత్రిపదవుల ఆశగాని! 7

ఔను కవివర్య తెలిసె నీఅభిమతంబు
తెలివి గలవారె దేశాధినేతలనుచు,
ప్రజలలో, జ్ఞాన హీనులు పాలితులని
జనుల తెగనాడు నీవేమి జ్ఞానివయ్యా? 8

పరిసమానుల, ద్వేషించు స్వల్ప గుణులు!
అధికులకు, సేవకులమన్న అల్పమతులు!
కక్ష, కలతలకే, లొంగి కాలుదువ్వ,
లేమి పరులెట్లు రాజ్యాన్ని ఏలగలరు? 9

ఏమి, నీరాత, నీకూత, ఏమివింత!
ధర ప్రజాశక్తి-శాసించు పురిని విప్ప,
అడ్డు, పడు మొనగాడె లేడవనిలోన
ననుచు, జెప్పని, నీవేమి రచయితవయ! 10

నిజమె, జనులార, జనశక్తి కెదురులేదు
ప్రభుత, యంత్రాంగ రథమును, నడుపనెవరు?
అర్హులన్నది, యేనాడు, యరసినార!
ప్రతిభ, కొరవడ, నడవదు, మరచినార! 11

ప్రతినిధులఁ, రాజ్యమే సాగ కథను జెప్ప
ప్రతిభ గలవారె ప్రజలలో పాలకులన!
జనులలో వారు లేరని జంకవద్దు!
సాటి, ప్రజనుద్ధరించగ, సాగును "కథ"! 12

ప్రతినిధుల నెన్న, మీరెల్ల ప్రభువుల కథ!
ఎన్నుకొనబడు, అవకాశమున్నది కద!
స్వీయ, లోపాల్ని, తిలకించ, చిందులేల?
అధిగ, మించుతు, ప్రగతిని, అందుకొనుడు! 13

మీ కథను, మీరు వినలేని, పిరికితనమె,
తరతరాలుఁగ, మిముఁద్రోసె, మురికిలోకి!
ప్రగతి నందగ, ప్రజలెల్ల బాగు పడగ
ప్రజల కథ ఇది చదవండి, ప్రగతికొరకె! 14

# 2వ ప్రకరణం

## రాజు-ప్రజల సంవాదం

కొలువు దీర్చగ నొకనాడు, కోటలోన
రాజు సింహాసనాసీనుడగుచు నంత
ప్రజను పరికించి క్షేమమా యనుచు బలుక
ఏ ఒకరు లేచి పలుకరు క్షేమమనుచు. 1

విస్మయంబంది, రాజంత వినగ బలికె
ఏమి జనులార మీతీరిదేమి వింత
రక్షకుడు రాజు ప్రశ్నించ కక్ష బూని
ఊరుకున్నారిదేమయ్య నోరు లేదె? 2

అనుచు గర్జించు ప్రభు జూచి ప్రజలు లేచి
పలికిరందరు నొకరీతి ప్రభువు వినగ
రాజు ప్రజకాత్మ యనురీతి బూజు పట్టె
ప్రభు శరీరమె ప్రజల న పాతమాట. 3

దేశకాలపు, స్థితిగతుల్ తెలిసె, మాకు
గద్దె దిగవయ్య రాజేంద్ర గంతులిడక
ననెడి ప్రజనాప సైన్యాని కనుమతివ్వ
దలచె రాజంత కుపితుడై కలవరపడి. 4

కదను త్రొక్కగ, నశ్వాలు కదలె ననగ
విషము గ్రక్కుచు భుజగాలు వెడలె ననగ
దుడ్డు కర్రలు గునపాలు ధూళిలేపి
కయ్య మొనరించ లేచారు అయ్యలంత. 5

చెంతనే, యున్న మంత్రి యీ వింతనుగని
వలదు రాజేంద్ర ఘర్షణ వలదు తగదు!
ప్రజ శరీరము రాజ ను పలుకు బలికి
మరల వారిని బాధించ మరలవద్దు! 6

హింసతో ప్రజను నిర్జించ నేగ వలదు
ఇలను, ప్రజమీద, కసిబూన, గలమె మనము?
కార్యవాదికి ఏలయ్య కత్తిని గొన?
నరకదలచును ఏనాడు పిరికివాడె. 7

అనిన మంత్రిని కాదన కనియె నిట్లు
దైవ ప్రతినిధి రాజని దలచ రేమి?
మీవిధిని మీరు మరచిరా మీరుశేమి?
రాజదూషణ చేతురే రచ్చకెక్కి? 8

కాలరీతిని ఎదిరించ కాలు కదప
నెన్ని గుండెలు ప్రజకు నీరీతి నెగుర
అనగ నయ్యలు తొడగొట్టి యనిరిట్లు
మంది బలముంది మీకేమి ముందు బడగ. 9

సాంప్రదాయము నీకిచ్చు శక్తి గాక
పాలకుల పట్ల మాకున్న భక్తి గాక
ఇలను రాజుగ నీవు రాణించ గలవ
జనుల జడిపించి పాలన జరుప గలవ? 10

ప్రజల రక్షించు ప్రభువను పాట పాడి
రాసక్రీడల నంతఃపురాల మెలగి
కోట పేటలనే గొని కులికి నావె
కలిమి ప్రజలంద నేమైన గరపినావె? 11

కలిమి నోచక బ్రతుకులు కన్నమైన
ఇడుములె బ్రతుకు ముడుపని గడచినామె
తర తరాలుగ మేమెల్ల మురికి పట్టి
మూల బట్టుగ నీ విల మూల మనగ. 12

ఏళ్ల తరబడి మమ్ముల నేలి నావు
కూలి బ్రతుకులె యేనాడు కూడు కొదవె
మీ వరాలకు సాధనాల్ మేము గామె
ఏడ నీశక్తి తైతక్కలాడ కయ్య. 13

అనుచు గర్జించు ప్రజ జూచి యనియె ప్రభువు
ఏమి బ్రహ్మయ్య, పుల్లయ్య భూమి దున్ను
సాదు జగతికి మీరెల్ల సాక్షులు కద
కత్తులను బట్టి యీనాడు కదలినారు. 14

ఎగిరి పడబోక ఎల్లయ్య ఏది నిజము
తెలిసికోవయ్య రామయ్య తెలివి మీరి
ఏమి సూరయ్య వెంకయ్య యేమిది కథ
రాజ భక్తిని మరచిలా రాజుకొనుట ? 15

తిరుగుబాటుతో బ్రతుకును త్రిప్పగలరె?
మహిని లేనట్టి రీతిని మప్ప గలరె?
రాచరిక స్వర్ణ యుగమును రచ్చ బెట్టి
మహికి జేసిన మేలును మరచినారె ? 16

పుడమి విభుడిట్లు పలుకగ నడుగు వేసి
అయ్యలందరు నీరీతి నడిగినారు
ప్రభువు ప్రజలను మాటనే పలకవద్దు
పదవి దక్కించుకొను రీతి వెదకవద్దు 17

అనగ రాజిట్లు ప్రశ్నించె నతిశయించి
రక్షకుడు లేని రాజ్యాన కక్ష, కలత,
కోరి జనులను జెరచగ దూర గలవు
ప్రజల రక్షింప గలవాడు ప్రభువె సుమ్ము 18

రాజ్యరమనేలె ధీరుడు రాజు గాదె?
అయ్యలకు రాజ్య పాలన అచ్చునయ్య?
ఈర్ష్య ద్వేషాల కిలనొంగి యీదులాడు
కూలి రైతులు యీ భువి నేలగలరె ? 19

అనుచు దెలిపిన రాజన్యుడదరి పడగ
అయ్యలావేశమున నిట్లు యడగినారు
పాలనాశక్తి మాకేమి పట్టు వడద
ఎల్ల ప్రజలకు ప్రభువులం కల్లకాదు 20

ధరను బాలించ మేమెల్ల తగదు మనెడి
ప్రజల గాంచుచు రాజిట్లు బలికినాడు
భావి, మానవ, ప్రగతికి పాలనొకటె
మూలకారణమని భువి నేల గలమె ? 21

ధరణి ధర్మాలు నీతులు దర్శనములు
వివిధ రీతుల నీతుల విప్పిజెప్ప ?
జనుల కాతీరు నెరిగిన జ్ఞాన మేది ?
ధర్మ నిర్ణేత వ్యాఖ్యాత ధరణి విభుడె 22

కలిమి లేమికి మీరయ్య కర్తలిలను
శృతులు, స్మృతులును మీరల్ల జదివినార,
కర్మఫలమని బ్రతుకును గాంచ లేదె ?
లేని పోని దురాశను లేపకండి ? 23

పుడమి విభుడిట్లు పలుకగ నడుగు వేసి
అఖిల జనులంత నీరీతి నడగినారు
కర్మ సాక్షియు వేదోక్తి మర్మమిదున !
సంఘమే హెచ్చు తగ్గుల సృష్టికర్త! 24

అనగ రాజన్యుడది విని యనియె నిట్లు
జీవులకు నెల్ల యధినేత దేవుడు గద
పరగ వ్యక్తుల కధినేత ప్రభువె సుమ్ము
గతములోనున్న ఘనతను, గాంచ రేమి ? 25

పేద జనులిట్లు జెప్పిరి పెదవి విప్పి
భేదమే లేని బ్రతుకిదు వేద సూక్తి
అధములధికులు ప్రజలని నరయ గలదె ?
సంస్కృతిని జూపి వ్యక్తిని చంపగలదె ? 26

పుడమి విభు ప్రక్క పుల్లయ్య నడచి వచ్చి
నీడ నిడితిమి యిన్నాళ్లు నింక చాలు
మేకలము గాము మేమెల్ల యాకులు దిన
గోడు విడనాడి గద్దెను వీడమనెను 27

బ్రహ్మయంతట యరచెను బల్ల గ్రుద్ది
పాలనే మాది మేమెల్ల ప్రభువుల మయ
హేతు విజ్ఞానమే లేని కూతలేమి ?
జ్ఞానరీతిని బట్టిన జనత కేమి ? 28

అంత రామయ్య సూరయ్య గంతులిడగ
ఎల్లయయు వెంకయయు నంత వెనుకనుండ
చుట్టుముట్టిన బ్రజలను జూచినాడు
విశ్వరీతిని గన, ప్రశ్న వేసినాడు 29

వసుధ గల వస్తురాసియు నంతయుగని
ధరణి, గల జీవ కోటిని నరయు మీవు
హెచ్చు తగ్గులు భేదాలు నెరుక పడవె!
ప్రకృతిలో లేని సూత్రము పట్టు వడునె? 30

వ్యక్తులను జూడ నెవరును వ్యక్తపడరె
ఏక బల రూప విజ్ఞాన తూక మంది
ప్రజ్ఞ ప్రతిచోటనుండదు పట్టువడదు
ప్రతిభ లేనట్టి వ్యక్తికి పదవదేల? 31

అభము శుభముల నెరుగని ప్రజలు మీరు
దేశ పాలన కొడిగట్టు నాశ వలదు
అర్ధబలమేమి మీవద్ద నాజ్ఞ నిడగ
శాచసిరి ఠీవి యబ్బునా రాజ్యమేల! 32

నచ్చ జెప్పిన రాజువై రెచ్చిపోయి
ప్రజలు కోపాన నీరీతి బలికి నారు
మహిని గలవారిలో మేమె మాన్యులమని
భువిని గల సంపదకు మీరె భోక్తలయిరి. 33

నృపుల సంతతె రాజ్యాల నేలి నార
రాజ్యమేలిన వారెల్ల రాజులైరి
దేశ చరితను దిలకించ దెలియ బడదె
ప్రజ్ఞగల వ్యక్తి పాలన బట్టినట్లు. 34

వసుధ గల వస్తురాసియు నంతయుగని
ధరణి, గల జీవ కోటిని నరయు మీవు
హెచ్చు తగులు భేదాలు నెరుక పడవె!
ప్రకృతిలో లేని సూత్రము పట్టు వడునె? 30

వ్యక్తులను జూడ నెవరును వ్యక్తపడరె
ఏక బల రూప విజ్ఞాన తూక మంది
ప్రజ్ఞ ప్రతిచోటనుండదు పట్టువడదు
ప్రతిభ లేనట్టి వ్యక్తికి పదవదేల? 31

అభము శుభముల నెరుగని ప్రజలు మీరు
దేశ పాలన కొడిగట్టు నాశ వలదు
అర్ధబలమేమి మీవద్ద నాజ్ఞ నిడగ
శాచసిరి ఠీవి యబ్బునా రాజ్యమేల! 32

నచ్చ జెప్పిన రాజువై రెచ్చిపోయి
ప్రజలు కోపాన నీరీతి బలికి నారు
మహిని గలవారిలో మేమె మాన్యులమని
భువిని గల సంపదకు మీరె భోక్తలయిరి. 33

నృపుల సంతతె రాజ్యాల నేలి నార
రాజ్యమేలిన వారెల్ల రాజులైరి
దేశ చరితను దిలకించ దెలియ బడదె
ప్రజ్ఞగల వ్యక్తి పాలన బట్టినట్లు. 34

## 3వ ప్రకరణం

# ప్రజారాజ్యం

ప్రజలె నేతలు యని మీరు పలకరండి
రాజులిక లేరు జనులెల్ల ప్రభువులైరి
అనుచు చంకలు గుద్దుచు నయ్యలంత
కోరి యొకచోట సభజేయ గూడినారు. 1

సమత స్వేచ్ఛలు రాజ్యాన సాగె ననగ
భావ ప్రకటన హక్కది బాగు యనగ
రైతు_రాజను భావమే రోతయనగ
నరుగు దెంచెను రాజును హర్షమంది. 2

సభను జేరిన రాజన్న నరసియంత
పండ్లుకొరుకుచు సూరయ్య పలికెనిట్లు
ప్రజల సభలోన రాజులా? పనికి రాదు
రాజులున్నచో మరి ప్రజారాజ్యమౌనె? 3

రాచరికమంతరించిన రాజు నుండి
కోట పేటలు మాన్యాలు దాటలేదె
కలిమి కిల రూపమయి నిల్చె బలిమి పరుదు
లేమినే కొని దేశాన్ని యేలగలడు. 4

## 3వ ప్రకరణం

# ప్రజారాజ్యం

ప్రజలె నేతలు యని మీరు పలకరండి
రాజులిక లేరు జనులెల్ల ప్రభువులైరి
అనుచు చంకలు గుద్దుచు నయ్యలంత
కోరి యొకచోట సభజేయ గూడినారు. 1

సమత స్వేచ్ఛలు రాజ్యాన సాగె ననగ
భావ ప్రకటన హక్కది బాగు యనగ
రైతు_రాజను భావమే రోతయనగ
నరుగు దెంచెను రాజును హర్షమంది. 2

సభను జేరిన రాజన్య నరసియంత
పండ్లుకొరుకుచు సూరయ్య పలికెనిట్లు
ప్రజల సభలోన రాజులా? పనికి రాదు
రాజులున్నచో మరి ప్రజారాజ్యమౌనె? 3

రాచరికవంతరించిన రాజు నుండి
కోట పేటలు మాన్యాలు దాటలేదె
కలిమి కిల రూపమయి నిల్చె బలిమి పరుడు
లేమినే కొని దేశాన్ని యేలగలడు. 4

కోరి మనమెల్ల యీనాడు కూడితిమిటు
పాలనేరీతి జరగాలో బలకరండి
అందరం నేడు రాజులం ముందు నడువ
దేశమేరీతి నుండాలో? తెలుపరండి. 10

పదుగురికి దేశ సంపద పంచవలయు
ననుచు నయ్యప్ప యరవగా నాగ్రహించి
కాదు కాదనె అచ్చయ్య కలవరపడి
సోమరికి శ్రమ జీవికి నొక్కతీరె? 11

ఆస్తులను బంచ మీరెల్ల నడిగినారు
భూములను ముందు పంచండి భుక్తినివ్వ
కష్టపడకుండ కలిమిని గాంచరాదు
స్థిర చరాస్థుల సంగతి దేల్చరండి! 12

ఔను నిజమిది కలిమిని ధూళి దులిపి
లేని వారికి బంచగ లేచి రండి
హింస దోపిడి కొనసాగ ప్రేరణిచ్చె
లేమి వ్యత్యాస భావాలు లేచి పోవ? 13

కట్టిబెట్టండి మీతీరు కష్టమయ్య
అన్నిటను స్వేచ్ఛ నొసగితి మనచు బలికి
కొన్నిటనుదాటకట్టుట కూడని పని
ఎవరి ఫలితము వారంద నేమి తప్పు? 14

కోరి మనమెల్ల యీనాడు కూడితిమిటు
పాలనేరీతి జరగాలో బలకరండి
అందరం నేడు రాజులం ముందు నడువ
దేశమేరీతి నుండాలో? తెలుపరండి. 10

పదుగురికి దేశ సంపద పంచవలయు
ననుచు నయ్యప్ప యరవగా నాగ్రహించి
కాదు కాదనె అచ్చయ్య కలవరపడి
సోమరికి శ్రమ జీవికి నొక్కతీరె? 11

ఆస్తులను బంచ మీరెల్ల నడిగినారు
భూములను ముందు పంచండి భుక్తినివ్వ
కష్టపడకుండ కలిమిని గాంచరాదు
స్థిర చరాస్తుల సంగతి దేల్చరండి! 12

ఔను నిజమిది కలిమివి ధూళి దులిపి
లేని వారికి బంచగ లేచి రండి
హింస దోపిడి కొనసాగ ప్రేరణిచ్చె
లేమి వ్యత్యాస భావాలు లేచి పోవ? 13

కట్టిబెట్టండి మీతీరు కష్టమయ్య
అన్నిటను స్వేచ్ఛ నొసగితి మనచు బలికి
కొన్నిటనుదాటుకట్టుట కూడని పని
ఎవరి ఫలితము వారంద నేమి తప్పు? 14

అనుచు నీరీతి మాట్లాడ నలుక జెంది
దేశ భోక్తలు మీరెల్ల దెలిసెనయ్యా
మరల నీరీతి మనమేగ మట్టి బ్రతుకె
తిరిగి దోపిడిపాలనే దిక్కు మనకు 20

కట్టిపెట్టండి సిద్ధాంత కథలు వద్దు
స్వీయ భావాలనిక మీరు చెప్పవద్దు
ప్రజల వాంఛను బసిగట్టి పలక రండి
జనులు కోరున దేమిటో వినగరండి 21

ఎవరు మీరయ్యా దేశాన్ని ఏలగాను
ప్రజల యెన్నికనే మీరు ప్రభువులయిర?
ధరను శాసించు రీతిని దరల వద్దు
మరల నొకమారు వెనుకకు మరలవద్దు 22

కొందరయ్యాలు నీరీతి కోపగించ
బ్రహ్మయయు లేచి ప్రజవిన బలికినాడు
"ఎన్నికలె దిక్కు" సిద్ధాంతమేది గొప్ప
సభ సమాప్తము ఎన్నికల్ జరుగునింక 23

అనుచు నీరీతి మాట్లాడ నలుక జెంది
దేశ భోక్తలు మీరెల్ల దెలిసెనయ్యా
మరల నీరీతి మనమేగ మట్టి బ్రతుకె
తిరిగి దోపిడిపాలనే దిక్కు మనకు 20

కట్టిపెట్టండి సిద్ధాంత కథలు వద్దు
స్వీయ భావాలనిక మీరు చెప్పవద్దు
ప్రజల వాంఛను బసిగట్టి పలక రండి
జనులు కోరున దేమిటో వినగరండి 21

ఎవరు మీరయ్యా దేశాన్ని ఏలగాను
ప్రజల యెన్నికనే మీరు ప్రభువులయిరి?
ధరను శాసించు రీతిని దరల వద్దు
మరల నొకమారు వెనుకకు మరలవద్దు 22

కొందరయ్యలు నీరీతి కోపగించ
బ్రహ్మయయు లేచి ప్రజవిన బలికినాడు
"ఎన్నికలె దిక్కు" సిద్ధాంతమేది గొప్పొ
సభ సమాప్తము ఎన్నికల్ జరుగునింక 23

రాజుగారును నడిచాదు రంగమందు
శిష్ట జనపార్టీ జగతికి శ్రేష్టమనుచు
ప్రజల రక్షించు సిద్ధాంత రచన గాదు
ప్రజల నాకట్టు కొనగల్గు ప్రజ్ఞ యనుచు 5

ఇవ్విధంబున నయ్యలు వేరుపడుతు
వివిధ పార్టీలనే బట్టి వెడలినారు
స్వీయ పార్టీయె గొప్పని జెప్పగాను
ఇతర పార్టీలు తప్పని దెప్పగాను 6

మారు మూలనె బ్రతుకంత మాసిపోవ
జేరబడి జీవితాలిల భారమనగ
కునుకు దీసెడి జనులెల్ల ఘనులె యనగ
జనము ఘనమని జప్పట్లు చరిచినారు 7

సోషలిజమును స్థాపించ చోటు నిడుదు
గుర్తుపై ముద్రనిడి మాకె ఓటు విడుడు
అనుచు బ్రహ్మయ్య నాయకుడనగ నిలచె
వెనుకబడిన వర్గాలకు వెలుగు నివ్వ 8

భువిలో కమ్యూనిజంబది ఎవరికొరకు
బడుగు జనులెల్ల సుఖపడ బాగు కొరకె
పుల్లయ్య యు నంత జెప్పెను ఎల్లరు విన
వర్గ పాలనె దేశాన వర్ధిలు నని 9

రాజుగారును నడిచారు రంగమందు
శిష్ట జనపార్టీ జగతికి శ్రేష్టమనుచు
ప్రజల రక్షించు సిద్ధాంత రచన గాదు
ప్రజల నాకట్టు కొనగల్గు ప్రజ్ఞ యనుచు 5

ఇవ్విధంబున నయ్యలు వేరుపడుతు
వివిధ పార్టీలనే బట్టి వెడలినారు
స్వీయ పార్టీయె గొప్పని జెప్పగాను
ఇతర పార్టీలు తప్పని దెప్పగాను 6

మారు మూలనె బ్రతుకంత మాసిపోవ
జేరబడి జీవితాలిల భారమనగ
కునుకు దీసెడి జనులెల్ల ఘనులె యనగ
జనము ఘనమని జప్పట్లు చరిచినారు 7

సోషలిజమును స్థాపించ చోటు నిడుడు
గుర్తుపై ముద్రనిడి మాకె ఓటు విడుడు
అనుచు బ్రహ్మయ్య నాయకుడనగ నిలచె
వెనుకబడిన వర్గాలకు వెలుగు నివ్వ 8

భువిలో కమ్యూనిజంబది ఎవరికొరకు
బడుగు జనులెల్ల సుఖపడ బాగు కొరకె
పుల్లయ్య యు నంత జెప్పెను ఎల్లరు విన
వర్గ పాలనె దేశాన వర్ధిలు నని 9

వ్యక్తి స్వార్థము విను వీధి నంటినపుడె
వాడు దౌర్జన్య పరుడని వీడు పలుకు
వీడు దోపిడి గాడని వాడు తెలుపు
జేరి సిద్ధాంతమున బోవ చిక్క లేదు. 15

కులము యొకచోట సిద్ధాంత మొక్కచోట
గుణము యొకచోట సిరిమూట యొకచోట
నాయకత్వము యొకచోట మంది బలమె
గెలుపునందెను ప్రజలదె గెలుపు యనగ. 16

ఎన్నికలలోన నేరీతి, స్థిరము కాదు
గాలి వాటమె ప్రజలెల్ల జాలిపడగ
ప్రజయభీష్టము దొరకదు పట్టువడదు
మాట నిలకడ దోబూచు నాటవిడుపు. 17

క్రాంతి జనులందు గన్పించ గాంతిరేఖ
నిచ్చు స్థిరమైన మార్గమె నిశ్చయముగ
చిమ్మచీకటి ప్రక్కన జిందులేయ
దేవురించక తప్పదు దేశమైన. 18

ఎన్నికల ఫలితాలని వెల్లడించ
పార్టి యధినేతలును రాజు ఫలితము గొనె
అన్ని పార్టీల్ని ప్రజలెల్ల ఆదరించ
అధిక సభ్యులనే పార్టి అందదయ్యె. 19

వ్యక్తి స్వార్థము విను వీధి నంటినపుడె
వాడు దౌర్జన్య పరుడని వీడు పలుకు
వీడు దోపిడి గాడని వాడు తెలుపు
జేరి సిద్ధాంతమున బోవ చిక్క లేదు. 15

కులము యొకచోట సిద్ధాంత మొక్కచోట
గుణము యొకచోట సిరిమూట యొకచోట
నాయకత్వము యొకచోటు మంది బలమె
గెలుపునందెను ప్రజలదె గెలుపు యనగ. 16

ఎన్నికలలోన నేరీతి, స్థిరము కాదు
గాలి వాటమె ప్రజలెల్ల జాలిపడగ
ప్రజయభీష్టము దొరకదు పట్టువడదు
మాట నిలకడ దోబూచు నాటవిడుపు. 17

క్రాంతి జనులందు గన్పించ గాంతిరేఖ
నిచ్చు స్థిరమైన మార్గమె నిశ్చయముగ
చిమ్మచీకటి ప్రక్కన జిందులేయ
దేవురించక తప్పదు దేశమైన. 18

ఎన్నికల ఫలితాలని వెల్లడించ
పార్టి యధినేతలును రాజు ఫలితము గొనె
అన్ని పార్టీల్ని ప్రజలెల్ల ఆదరించ
అధిక సభ్యులనే పార్టి అందదయ్యె. 19

చేత జండాల నిడికొని జేయి గలిపి
రైతు సభలను జరిపాము రైతు కొరకె!
ఇరువురము నేడు ఒక ఊదు మిష్టమైన
మంత్రి వర్గము ఏర్పడి మహిని నేల! 5

అనగ పుల్లయ్య యదివిని నవియె నిట్లు
రెండు పార్టీల వారము యైక్యమవగ
అఖిల జనులును యెంతైన హర్షమొందు
మంత్రి వర్గము యేర్పడ మాకు హితమె! 6

బ్రహ్మయయు ముఖ్యమంత్రిగ బదవి పట్టె
ఆర్థిక పురశాఖ పుల్లయ కమరగాను
అయ్యలందరు మంత్రులై యధికులైరి
రాజులిక లేరు శ్రామికుల్ రాజులైరి! 7

శ్రామికులు కర్షకులు గూడి భూమినేల
ప్రగతి జనపార్టి ప్రతిపక్షమనగనిలచె
శిష్టజనపార్టి ప్రభుతలో జేరబోక
అయ్యకేరీతి నుందురో అరయదలచె! 8

చేత జండాల నిడికొని జేయి గలిపి
రైతు సభలను జరిపాము రైతు కొరకె!
ఇరువురము నేడు ఒక టౌదు మిష్టమైన
మంత్రి వర్గము ఏర్పడి మహిని నేల! 5

అనగ పుల్లయ్య యదివిని ననియె నిట్లు
రెండు పార్టీల వారము యైక్యమవగ
అఖిల జనులను యెంతైన హర్షమొందు
మంత్రి వర్గము యేర్పడ మాకు హితమె! 6

బ్రహ్మయ్యయు ముఖ్యమంత్రిగ బదవి పట్టె
ఆర్థిక పురశాఖ పుల్లయ కమరగాను
అయ్యలందరు మంత్రులై యధికులైరి
రాజులిక లేరు శ్రామికుల్ రాజులైరి! 7

శ్రామికులు కర్షకులు గూడి భూమినేల
ప్రగతి జనపార్టి ప్రతిపక్షమనగనిలచె
శిష్టజనపార్టి ప్రభుతలో జేరబోక
అయ్యకేరీతి నుందురో అరయదలచె! 8

సూరయ్యయు నెల్లయ్యయు నంత సోలిపోతు
చిన్నబోవుచు నెంతయు ఖిన్నులగుచు
తిన్నగా చేరి రొకచోట కన్నుకుట్టి
వెంకయ యు నంత వారికి వెనుకనుండ! 5

ఇరుగు పొరుగుల వారికి నింద్రపదవి
ఎట్లు మనగల మింకను యేది దిక్కు
బాగుపడె బ్రహ్మయ యని గుండె బాదుకొనుచు
వారు నృపుజేర గోటలో దూరినారు! 6

తనను దెప్పిన నొకనాటి తగవరులను
అమిత ప్రేమతో రాజంత యాదరించి
ఏమి సూరయ్యా వెంకయ్యా ఏమిటి కథ
ఎందులకు వచ్చినది మీరు ఎరుక పడదె? 7

అనుచు రాజిట్లు పలుకగ నయ్యలంత
తలలు దాచుకు జెప్పిరి తడబడుచును
మీరు రాజులు యేమైన మీకు తగును
ప్రజల పాలింప జూచుట మీకు తగునె ? 8

దేశ కాలాలరీతుల దెలియలేక
మిడిసిపడినాము యొకనాడు జడుల రీతి
మేదినీపతి నొవ్వగ మెలగినాము
జగతినేలగ మేమెల్ల తగుదు మనుచు! 9

సూరయయు నెల్లయయు నంత సోలిపోతు
చిన్నబోవుచు నెంతయు ఖిన్నులగుచు
తిన్నగా చేరి రొకచోట కన్నుకుట్టి
వెంకయయు నంత వారికి వెనుకనుండ! 5

ఇరుగు పొరుగుల వారికి నింద్రపదవి
ఎట్లు మనగల మింకను యేది దిక్కు
బాగుపడె బ్రహ్మయ యని గుండె బాదుకొనుచు
వారు నృపుజేర గోటలో దూరినారు! 6

తనను దెప్పిన నొకనాటి తగవరులను
అమిత ప్రేమతో రాజంత యాదరించి
ఏమి సూరయ్య వెంకయ్య ఏమిటి కథ
ఎందులకు వచ్చినది మీరు ఎరుక పడదె? 7

అనుచు రాజిట్లు పలుకగ నయ్యలంత
తలలు దాచుకు జెప్పిరి తడబడుచును
మీరు రాజులు యేమైన మీకు తగును
ప్రజల పాలింప జూచుట మీకు తగునె ? 8

దేశ కాలాలరీతుల దెలియలేక
మిడిసిపడినాము యొకనాడు జడుల రీతి
మేదినీపతి నొవ్వగ మెలగినాము
జగతినేలగ మేమెల్ల తగుదు మనుచు! 9

రైతు రాజ్యమె కావాలి - రాజు వద్దు
కేకలేవేసి నన్నెంతొ తాకినారు
మరల యీనాడు మీరిట్లు మాటమార్చి
రైతు రాజ్యము వద్దని రగడదేల ? 15

అవని విభుడిట్లు పలుకగ నదరి పడిరి
చేతులను మోడ్చి వారెల్ల జెప్పిరిట్లు
మీకొరకు గాదు మేదిని మేలు గాంచ
రాజ్యమేలాలి తప్పదు రాజుగారు. 16

అనగ రాజంత నగుచును వినగ బలికె
పదవి నందగ బలమైన పార్టి లేదు
అందినను అందలం ఎక్క ఆశలేదు
ప్రతినిధిగ నుంటినది చాలు ప్రజల కొరకె! 17

అనుచు రాజిట్లు తెలుపగ నయ్యలంత
వేడుకొనిరిట్లు వారికి తోడు పడగ
ఎత్తుగడ వేసి బ్రహ్మయ్య నెగురగొట్ట
కుటిలనీతికి వచ్చాము ఘటికులమన. 18

ఈర్ష్యనందిన యయ్యలు వీధిపడుతు
జాతి వానిని యడ్డగ కోతకోయ
వచ్చినారని భావించి వర్గగుణము
తెలియ, బడ రాజు యీ రీతి బలికినాడు! 19

రైతు రాజ్యమె కావాలి - రాజు వద్దు
కేకలేవేసి నన్నెంతొ తాకినారు
మరల యీనాడు మీరిట్లు మాటమార్చి
రైతు రాజ్యము వద్దని రగడదేల ? 15

అవని విభుడిట్లు పలుకగ నదరి పడిరి
చేతులను మోడ్చి వారెల్ల జెప్పిరిట్లు
మీకొరకు గాదు మేదిని మేలు గాంచ
రాజ్యమేలాలి తప్పదు రాజుగారు. 16

అనగ రాజంత నగుచును వినగ బలికె
పదవి నందగ బలమైన పార్టి లేదు
అందినను అందలం ఎక్క ఆశలేదు
ప్రతినిధిగ నుంటినది చాలు ప్రజల కొరకె! 17

అనుచు రాజిట్లు తెలుపగ నయ్యలంత
వేడుకొనిరిట్లు వారికి తోడు పడగ
ఎత్తుగడ వేసి బ్రహ్మయ్య నెగురగొట్ట
కుటిలనీతికి వచ్చాము ఘటికులమన. 18

ఈర్ష్యనందిన యయ్యలు వీధిపడుతు
జాతి వానిని యడ్డగ కోతకోయ
వచ్చినారని భావించి వర్గగుణము
తెలియ, బడ రాజు యీరీతి బలికినాడు! 19

ఇంతలో లేచి వెంకయ్య విరుచుకు పడె
సంపదున్నంత మాత్రాన జాలదయ్య
ప్రజ్ఞనాకుంది ఓ రాజ పదవి నాదె
ముఖ్యమంత్రన మాటలా ముచ్చటపడ! 25

అయ్యలీరీతి నెంతైన వాదులాడ
కసరి పొమ్మనె రాజంత విసుగు జెంది
మీలో ఐక్యత లేకను నేల నేలు
పదవి గొను హక్కు రాదది పట్టువడదు! 26

అరనిమేషము మెదలక నూరకొనిరి
బడుగు బ్రహ్మయ్య కంతట పదవి నొంద
తమకు గల పేరు ప్రఖ్యాతి తరిగిపోదె?
అనుచు నాత్మను దలపోసి యనిరి యిట్లు! 27

మేము గాకున్న పోయె మాకేమి వద్దు
అల్పులము మేము అధికారమంద లేము
పదవి మాలోన నెవరికి జెందకున్న
బ్రహ్మయకు నందకున్నను బ్రతకగలము! 28

కోటలో దూరితిమి మిమ్ముకోరి కొలువ
మాకు జేయూతనివ్వగ మానవద్దు
మీరె తీర్చాలి మాకోర్కె మేలు గాంచ
గుట్టుగా జేసి పుణ్యము గట్టుకొనుడు! 29

ఇంతలో లేచి వెంకయ్య విరుచుకు పడె
సంపదున్నంత మాత్రాన జాలదయ్య
ప్రజ్ఞనాకుంది ఓ రాజ పదవి నాదె
ముఖ్యమంత్రిన మాటలా ముచ్చటపడ! 25

అయ్యలీరీతి నెంతైన వాదులాడ
కసరి పొమ్మనె రాజంత విసుగు జెంది
మీలో ఐక్యత లేకను నేల నేలు
పదవి గొను హక్కు రాదది పట్టువడదు! 26

అరనిమేషము మెదలక నూరకొనిరి
బడుగు బ్రహ్మయ్య కంతట పదవి నొంద
తమకు గల పేరు ప్రఖ్యాతి తరిగిపోదె?
అనుచు నాత్మను దలపోసి యనిరి యిట్లు! 27

మేము గాకున్న పోయె మాకేమి వద్దు
అల్పులము మేము అధికారమంద లేము
పదవి మాలోన నెవరికి జెందకున్న
బ్రహ్మయకు నందకున్నను బ్రతకగలము! 28

కోటలో దూరితిమి మిమ్ముకోరి కొలువ
మాకు జేయూతనివ్వగ మానవద్దు
మీరె తీర్చాలి మాకోర్కె మేలు గాంచ
గుట్టుగా జేసి పుణ్యము గట్టుకొనుడు! 29

అప్పులేజేసి యాస్తులు జప్తు కాగ
పూట బత్తెము లేకను పొరలినాడె
లోటు పరునికి యీనాడు కోటు పేట
ఈర్ష్య పుట్టదె జనులు భరించగలరె 5

పదవి నందిన తదుపరి ప్రజను వీడి
మేడ మిద్దెల తానంది మెలగెను గద
అన్ని యవకాశములు తన యన్న వరకె
ఎల్ల ఉద్యోగములు తన యన్న ప్రజకె 6

బీద జనులను గాపాడు నాథుడనని
నలుగురెని జేరదీసెను నాయకుడయి
ప్రజలు పందుల గుడిసెలో పస్తులుండ
మందిరాలలో మెలగ మహాత్ముడగునె 7

అలుక జెందిరి యయ్యలు యందు వలన
నన్ను నంపించినారు నిన్నెన్ను కొనగ
నాయకత్వము నీకిడ న్యాయమనగ
బ్రహ్మాయను వీడి మా మాట బలకవలయు 8

అనెడి రాజన్న మాటల కదిరిపడిన
అంతరంగాన నిసుమంత యాస పుట్టె
తనువు పులకించ పదవికి తగుదువనగ
సంశయించుచు ప్రభువుతో పలికినాడు 9

అప్పులేజేసి యాస్తులు జప్తు కాగ
పూట బత్తెము లేకను పొరలినాడె
లోటు పరునికి యీనాడు కోటు పేట
ఈర్ష్య పుట్టదె జనులు భరించగలరె 5

పదవి నందిన తదుపరి ప్రజను వీడి
మేడ మిద్దెల తానంది మెలగెను గద
అన్ని యవకాశములు తన యన్న వరకె
ఎల్ల ఉద్యోగములు తన యన్న ప్రజకె 6

బీద జనులను గాపాడు నాథుడనని
నలుగురెని జేరదీసెను నాయకుడయి
ప్రజలు పందుల గుడిసెలో పస్తులుండ
మందిరాలలో మెలగ మహాత్ముడగునె 7

అలుక జెందిరి యయ్యలు యందు వలన
నన్ను నంపించినారు నిన్నెన్ను కొనగ
నాయకత్వము నీకిడ న్యాయమనగ
బ్రహ్మయను వీడి మా మాట బలకవలయు 8

అనెడి రాజన్న మాటల కదిరిపడిన
అంతరంగాన నిసుమంత యాస పుట్టె
తనువు పులకించ పదవికి తగుదువనగ
సంశయించుచు ప్రభువుతో పలికినాడు 9

పుడమి విభుడిట్లు పలుకగ నడుగు వేయ
పుల్లయ శరీరమంతయు పులకరించె
ఒకరి నొకరిని గూడగ నొట్టువేసి
ఐక్యమైపోయి రిర్వురు యేకమగుచు



పుడమి విభుడిట్లు పలుకగ నడుగు వేయ
పుల్లయ శరీరమంతయు పులకరించె
ఒకరి నొకరిని గూడగ నొట్టువేసి
ఐక్యమైపోయి రిర్వురు యేకమగుచు



నిజమె యధ్యక్షు మాటపై నిలుతు మేము
ఘడియ కొక నిర్ణయం జేయు ఘనులు వీరు
అస్థిరతక సందిగ్ధత కాత్మ సుతులు
వీరిదొక ముఠా సిద్ధాంత మేది లేదు! 5

అనుచు సూరయ్య వెంకయ్య యరుపులనిడ
స్పీకరును గాంచి బ్రహ్మయ్య చెప్పెనిట్లు
బల్ల చరుపులు తప్పించి బలము గలదె
ఎదుటి వారిని దెప్పుటే వీరి బ్రతుకు! 6

అంత చులకన జూడకు, సభ్యుల సభ
మంత్రులను బట్టి నిలదీసి యడగ గలదు
చర్చకనుమతి నివ్వాలి సభలో నేడు
తుచ్ఛమగు వారి పాలన రచ్చకెక్క! 7

సభలో సంఖ్యాబలం ఉన్న సాగని పన
చేతులెత్తగ స్పీకరు లెక్క వేసె
సభను గల సభ్యులధికులు సమ్మతింప
చర్చ కొనసాగ స్పీకరు చేరబలికె! 8

సభన విశ్వాస తీర్మాన చర్చ సాగ
అయ్యలందరు లేచారు కయ్య మాడ
అఖిల పార్టీల కిది యవకాశమనగ
చర్చ సాగెను నొక నాడు రచ్చకెక్క! 9

ఏమిపాలన మీదయ్య భూమినేల
తగుదుమని దెల్పి యెల్లరు తరలి నారె
ప్రజల కష్టాల మీరేమి బాపినారు?
దేశ బాగుకు మీరేమి తెలిపినారు? 10

పేరునకు ప్రజాస్వామ్యము పెద్దలెవరు?
బాగుపడలేదె ప్రతినిధుల్ భాగ్యమంది?
ప్రతినిధుల రాజ్యమిదియని బలకరంది
ప్రజలనే మోసగించెడి పథక మౌర! 11

కోట్లప్రజ కూడులేకను కుములు చుండ
ఓట్లుకొని మీరు కులుకుటూ కోటలోన
దీన ప్రజ గూడులేకను దిమ్మరించ
మల్లెపందిరిలో మంత్రి మసలు టేమి? 12

ప్రజలు పందుల గుడిసెలో పస్తులుండ
మందిరాలలో మెలగ మహాత్ములగునె?
అమిత సిరి సంపదల తూగు యాస్తిపరులు
ధరను బ్రజనుద్ధరించెడి ధర్మపరులె? 13

పాఠశాల నిరుద్యోగ ప్యాక్టరి కద
యువత కోపానలాగ్నికి యాజ్యము గద
బ్రతుకులను బాగు చేయని బడులవేల
శ్రమకు, విలువివ్వనట్టి యీ చదువులేల! 14

పెట్టుబడిదారు పంచలో పట్టువడుతు
పేదలకు కూలినాలిని పెంచగలరె?
అమిత యాస్తుల బెంచగ హద్దునిడక
ప్రజల దారిద్ర్యమును మీరు బాపగలరె! 15

అధిక ధర లిల యాకాశమంటు లేదె?
అదుపు దప్పు నిరుద్యోగమాపినారె?
అక్రమార్జన పరులనే వంచలేరు!
వస్తురాశిని మీరెలా పంచగలరు? 16

రైతు కూలీల పార్టీని రంగువేసి
మేక వన్నెతో పులులన్ని మేళమాడె
పేదలను బాగు పరచగ బోధనలిడి
ధనికులను పెద్దచేసెడి ఘనులు మీరు! 17

మేతలిడితిమి మేయండి మేకలనిన
తన్నుకొనిపోవు గ్రద్దల దరిమినారె
రాహుకేతులు గ్రామాలరక్కరించ
మీరు బాహువులగుచును మెలగ లేదె! 18

ఎండలో వానలో బ్రతుకు మొండిదేర
బుగ్గిలో బురదలో వయసు బూడిదవగ
పసిడి పంటల నిర్మాత భాగ్యదాత
బ్రతుకునకు నేడు మసిపూత మట్టిరాత! 19

శ్రామికుల పార్టినాదని చాటినారు
కార్మికుల హీన దుస్థితి నాపినార?
కర్షకుల పార్టీ నాదని గదలి నారు
రైతు జనకోటి లేమిని బాపి నార? 20

సామ్యవాద వ్యవస్థని జాటినారె
దోపిడీదార్ల నెవరిని యాపినారు?
జీతభత్యాలు పెన్షన్ల జేబునిడుతు
ఆస్థిపాస్తుల హక్కుల, నాపరేమి? 21

స్వేఛ్ఛ నిచ్చితిమని, మీరు చెప్పకండి
చెడిన బ్రతుకులకేలయ్య స్వేచ్ఛయిలను
దారిదోపిడికిది యొక ధర్మపథము
స్త్రీయ, యాస్థుల రక్షించు చిందులాట 22

వెనుకబడిన వర్గాలవి వెలుగు గాంచ
వేలు లక్షలు వెచ్చించి యేలినారె
నోరుగల యూరిపెద్దలె నేరమనక
నడుమనే మ్రింగ తప్పని అడిగినార? 23

కొండ జాతులు హరిజనుల్ దండి యనిరి
ఉండటానికి వసతియుద్యోగ మనిరి
పల్లె సీమల కొక మారు వెళ్ళిరండి
కూడు, గుడ్డలు లేకను కుములు వారె! 24

పూట గడిచెను పగలెల్ల పాటుపడగ
గంజి యంబలి మాకేమి ఘనుల మనుచు
విర్రవీగెడి రైతుల వెర్రితనమె
మీకు శ్రీరామరక్షని మాకు తెలుసు! 25

ప్రజల రాజ్యము కాదిది ప్రతినిధులది
కలిమి పరులదె రాజ్యము కల్లగాదు
పదవులని పంపకాలని ప్రకటన లిడి
ఎంతకాలము రాష్ట్రాన్ని ఏలగలరు ? 26

మట్టితినె రైతు నొవ్వగ పన్నువేసి
నగరవాసుల యాస్తిని అణచరేమి?
సంస్కరణ జేయ జూచెడి శక్తిలేక
దైవ కృపయని తప్పించి తిరగవద్దు! 27

చెదల రీతినసంఖ్యాక చదువరులిల
వెలసి వెలలేక నిలలోన దిరుగుచున్న
స్థితిగతుల గూర్చ నేమైన జేసినార?
చూడగలమనె కాలము గడిపినారు! 28

బంధుప్రీతికి అవినీతి కందుబాటు
ప్రభుత కార్యాలయాలవి ప్రగతి సున్న
పలుకుబడి లేక ఏపని పలకదు కద
పైకమివ్వని మహజరు మెదలదు కద! 29

జ్ఞానమందించ విశ్వవిద్యాలయాలు
మనుగడను గూర్చ వృత్తి విద్యాలయాలు
ఏది శృతిమించి వేరొక్కటిరుకునపడ
కానబడదయ్యె లోకాన క్రాంతిరేఖ! 30

కడుపు మంటతో కన్నీరు కార్చలేక
బ్రతుక కొనసాగ యేపని పాటలేక
తిరుగుతున్నారు ఎందరో తిరిపెమెత్త
గద్దె దిగిరండి మీ పొత్తు వద్దుమాకు! 31

ప్రజల ధనమును మెక్కిన పందికొక్కు
చావమోదిరి యేనాడు సందు దూర
జంతు న్యాయమె సంఘాన గంతు నిడిన
ఎంత మావంతు యనుమాట ఎంత వింత ? 32

అందరికి కూడు నందించు యంత్రమనుచు
ఉన్న వృత్తుల నన్నింటి నూడ్చినారు
వస్తు నిర్మాత కరువుకి నేస్తమంతు
అమ్మకందారుడగునటు యెప్పుడిలను 33

మంత్రినని డాబు దర్పాలు మానరండి
ప్రజలసెంబ్లీకి మీరెల్ల భాద్యులు కద
రాజునే మంత్రి కాజేయ రాజ్యమిదియ
జనులె రాజులు లేవగ కనబడిరిల! 34

గాలికిని పోసి యీరీతి గంపకెత్త
సభ్యులెల్లరు కరతాళ ధ్వనులు సలుప
స్పీకరును ముఖ్యమంత్రిని జేర బిలచి
చర్చకు జవాబు నిచ్చుటే సభ్యతనెను! 35

బ్రహ్మయయు లేచి సభ అంత ప్రస్తుతింప
కరములను మోడ్చి యిట్లనె గరుణ దోష
పాతకథలనె వల్లించి పాటపాడ
వినని వారెవ్వరిచ్చుట వింతకాదు! 36

తప్పిదాలను బసికట్టి గొప్పవారు
దెప్పి పొడవగ, దినమెల్ల దప్పిగొనరు
వాద ప్రతివాదములనేవి వర్ధిలు విల
బాధలను గాథలుగ మార్చి బ్రతకవద్దు! 37

అభ్యుదయ మంద ముందుకు నడుగు వేసి
వెనక గోతిని దూకగ వెరపదేల
భోగభాగ్యాల బ్రతుకులో బోర్లపడుతు
కాదు లేదని జెప్పుట కాంత్రి కాదు! 38

చందమామిచ్చు కాంతిని జల్లదనము
మచ్చ చూపించి లేదని మాపగలమె
అభ్యుదయమంది జనమెల్ల నడుగు వేయ
భిక్షుకుని జూపి లేదన పిచ్చితనమె! 39

దేశమొక యూత నిచ్చెడి తెరువు తప్ప
అరగించగ వడ్డించె అమ్మకాదు
నీరు త్రాగించ గుర్రాన్ని లేపగలము
త్రాగ నొల్లక వెనకెట్టు లాగ గలము! 40

ప్రజల మనుములమే మని పలకవద్దు
ఎవరు కానిదో సభలోన దెలుపరండి
దొంగ దొంగని యరచుట రంగు కొరకె
కాని వారిని దేల్చగ కదలి రండి! 41

నేటి మన విద్యలో నేమి లోటు గలదు
స్వేచ్ఛ విలువల నందించి శ్రేష్టత గొనె
న్యాయవేత్తలు నాయకుల్ నాగరికులు
ఉపకరించకనే విద్య ఊడిపడిర! 42

వెనుక పడలేదె దేశాన వైద్య విద్య?
ఎందులో వెనక మన దేశ ఇంజనీర్లు?
జ్ఞాన ధనులకు కొరతేమి కానబడదె?
పాలకులు లేరె దేశాన్ని ఏలలేదె? 43

చేతికందిన స్థితిగతుల్ని సడిస్తు
కాంక్షకును లొంగి చేజాచి కదలనేల
లేనిదానిని నాశించలేదు తప్పు
ఉన్న దానిని లేదన నుండు తప్పు! 44

అధికధరలని మీరంత యడిగినారు
వ్యక్తి కొనుగోలు శక్తది, మరచినారె
వస్తు సేవలనదుపిడ నష్టము కద
మిశ్రమార్థిక రీతిలో కష్టము కద! 45

తిండికిని గుడ్డకును రైతు దేవురించె
కథలు లేవయ్య పంటల కధిక ధరలు
బ్యాంకు ఋణమంద లేదని బలుక గలరె
సబ్సిడీ లేని పథకము సాగదు కద! 46

రైతు బిడ్డలకేమయ్య రాయితీలు
పయిస చేతను లేకనే పయి చదువులు
పరులకన్నను ముందుగా ప్రభుత పదవి
నేలదున్నిన వారిదే నేటి ఘనత. 47

కాకినిక్కరె బ్రతకని కేక వేసె
కార్మికుడు నేడు పొందడె కష్టఫలము
జాతి ఆదాయమును మించి వేతనమట
దేశ భక్తిని తలదన్ని బ్రతకగలమ? 48

ప్రతినిధుల రాజ్యమిదియని బలికినారు
ప్రజలు కాదన్న సభనుండ వశమ మనకు?
జనయభీష్టమె సర్వత్ర జరుగును కద
మన యభీష్టము కొన్నాళ్లె మంచి కొరకు! 49

భావనాస్వేచ్ఛ నిడ మీరు బాధపడిరె
ఎవరి స్వేచ్ఛకు వారుండ ఎంతహాయి!
బానిసపు బ్రతుకు మీరంత బ్రతుక గలరె?
కోటపేటల నిచ్చిన కోట్లనిడిన! 50

కలుపు మొక్కల బెడదకు నలిగి మనము
పైరునకు నీరు పెట్టక మానగలమ
నోరుగల యూరిపెద్దలు మీరు మేమె
ఎదుటి వారిలో తప్పుల వెదక నేల ? 51

కొండ కోనల దిరుగాడు కోదులెల్ల
నుండ విల్లును బనిచేయ బండియెడ్లు
కట్టువస్త్రము వ్యవసాయ పరికరాలు
భూమిపై హక్కులేదని జూపగలర? 52

పల్లెప్రజ వెర్రివారని బలికినాడు
చదువు రానంత మాత్రాన చవటలయ్యె?
లోక జ్ఞానాని కిసుమంత లోటులేదు
ఓటుతో పొడవ నేర్చిన మేటివరులు 53

బద్ధకం బల్సి సోమరి బ్రతుకు బ్రతికి
తిరిపెమెత్తుచు ప్రభుత నా తిట్టుటౌర?
వచ్చె యవకాశముల నెల్ల వడినగట్టు
బయలుదేరాలి యవి వచ్చునవగ భ్రాంతి 54

చదివినను లాభమేనని సణుగులేల?
చదువు లైనంత మాత్రాన నధికుడనియ?
జ్ఞానివని పీఠమేయగ జడులు లేరు
ఉపకరించని నీకెవ డుపకరించు? 55

ఆధునిక యంత్ర రీతిని యాదరించ
వస్తు నిర్మాణ పద్ధతి వరుసమారె
వృత్తిమేరకు జీవనా వృత్తి గలుగు
జీవితం మేరకే వృత్తి నేరమయ్యె 56

ప్రభుత కార్యాలయాలవి పతనమైన
వెనుకబడు జాతు లేరీతి వెలుగు నందె?
పాలనా శాఖలే యవి పట్టుతప్ప
ప్రజకు యీనాడు యీరీతి ప్రగతి గలదె 57

దేశ జన సంఖ్య మితిమీరి తెలియబడగ
జరుగు యభివృద్ధి యిందులో గరగిపోయె
తెలిసి తెలియని రీతిలో మెలగుటేమి
అపదను నడ్డ మీరంత యాదుకొనుడి 58

అతిశయంబున నెవ్వరు పలుకవద్దు
ప్రగతి మిన్నంటెనని మేము పలుకబోము
సభన విశ్వాసతీర్మాన చర్చ ముగిసె
నంచు బ్రహ్మయ్య యాసీనుడయ్యె నంత 59

స్పీకరంతటు సభవిన చెప్పెనిట్లు
చర్చ ముగిసింది తేలాలి సారమిపుడు
పలువురిక లేచి మీయిచ్చ దెలుపగానె
తలలు లెక్కించి ఫలితము దెలుపగలను 60

ఓటునే వేసి సభ్యులు సీటుజేర
స్పీకరును లెక్క పెట్టుచు జెప్పెనిట్లు
ప్రభుత పక్షము వీగెను బలము లేదు
అధిక సంఖ్యను ప్రతిపక్ష మందగలిగె 61

ప్రకటునిచ్చిన స్పీకరు పలుకును విని
ఝల్లుమన గుండె బ్రహ్మయ్య చకితుడయ్యె
అధిక సంఖ్యను వారెట్లు యందిరౌర
మిత్రమా పుల్లయా యని పిలువ లేచె 62

శిరమునే వంచి చల్లగ జారు కొనెడి
పుల్లయను జూచి బ్రహ్మయ్య త్రుళ్లిపడెను
ప్రాణమిత్రుడు నీరీతి బాణమేసె
కుత్రు జరిగింది రాజుతో గూడి చేసె! 63

లోన ముసి ముసి నవ్వులు కానబడగ
మెరసి పడుతున్న పుల్లయ నరసి యపుడు
బలికెవంతటు బ్రహ్మయ్య పదుగురు విన
ఏమి నీరీతి పుల్లయ్య ఎంత సిగ్గు! 64

మిత్ర ద్రోహి మాపాలిటి శత్రు వీవు
నమ్మక ద్రోహివని నేడు మాకు దెలిసె
కుట్రి సలుపగ రాజుతో గూడు టేల?
ప్రభుత నీదౌను యొక మాట పలుక నాతో. 65

విరగబడినవ్వి పుల్లయ్య యరచెనిట్లు
బ్రితిమిలాడిల నధికారమందగలమె
మంది బలమున్న మాకేమి క్రిందనుండ
సహజ శత్రువుతో మాకు సంధియేల? 66

మోసమనుచును నీవెంత మొత్తుకొన్న
పీసమంతైన నీరీతి వెలుగు కనదు
కుట్రిలకు లొంగి రాజ్యాలు కూలలేదె
వారసత్వమె బ్రిహ్మయ్య వణికేదెల? 67

అనగ విని బ్రహ్మయునిట్లు యరచినాడు
తన్నులాటను గల్పింప తగుదువయ్య
ఈర్ష్య ద్వేషాల విడికొని వీధి పడగ
నీదు కుట్రయె యొకనాడు నిన్ను గూల్చు. 68

ఇట్లు దూషించు బ్రిహ్మయ్య కెదురుపడుచు
దురుసుతో పల్కె పుల్లయ్య పరుసమొప్ప
అడ్డదారను నీవలె నరగలేదు
మేడమిద్దెల నేనెక్కి మెలగలేదు! 69

ఓరి పుల్లయ్య కడు దిగజారి నీవు
బ్రతకలేకను బ్రతికిన వాని జూచి
లేని పోనివి కల్పించ నేర్చి నావె
అనుచు బ్రహ్మయ్య యావేశముందెనిట్లు! 70

లేమి నెరుగని వంశాన భూమి దున్ని
సిరిని పండించు నింట జన్మించినాను
దొసగు దోపిడి లేనట్టి త్రోవ నాది
జీవనాధార మిచ్చెడి ఛేవ నాది! 71

అనగ పుల్లయ్య కోపాన నరచెనిట్లు
నక్క కుక్కవు పందిలా బుక్కినావె
మాకు చేసినదేముంది మట్టిగాక
ప్రజల బుర్రలు కొట్టిన ప్రముఖుడవయ! 72

నిజమె పుల్లయ్య నీరీతి తెలియదేమి
దొంగలెక్కలు మోసాలు రంగరించి
ఎంగిలాకున డబ్బును ఏరినావె
నలుగురిలో నీవు యీనాడు నాయకుడవయ! 73

ఎంత కాలము నీవిట్లు యీర్ష్యపడుచు
ఇతరులను తూలనాడుచు బ్రతుక గలవు?
ఒరుల నింది చుటే నీకు వృత్తి కాదు
పరులకేమైన చేయగ పసయు గలదె? 74

నిజమె బ్రహ్మయ్య నీవలె నిలువలేదు
చుట్టు తిరిగిన వారికే చురక నిడుతు
జలగలా ప్రజ రక్తము పీల్చినావు
కలిమి నిల పెంచుకొని తెగ బలిసినావు! 75

అంత బ్రహ్మయ్య నీరీతి ననియె వినగ
నేరమని తెలిసి గుడిసెల్లో దూరగలవు
ఉత్తముడనంచు ప్రజ చెవి కొరకు గలవు
ప్రక్కవాడింత వాడవ బ్రతక గలవె? 76

కోరి యీనాడు కడు దిగజారినావు
వ్యక్తిగతముగ నిందించ వచ్చితివయ
మనిషి బలహీనతల నమ్మి బాగుపడవు
వంచనతో రాజకీయాల ? వట్టి భ్రాంతి 77

నాయకులు యిట్లు యీర్ష్యతో వాదులాడ
సడుము కట్టిరి యనుచరుల్ తొడలు కొట్టి
ఒకరినొకరిని దూషించి రోర్మి విడచి
ఒకరి బాగును జూచొక రోర్వలేక 78

అంత సభలోన సభ్యులు గంతులేయ
స్పీకరును చీదరించుచు చెప్పెనిట్లు
ప్రతినిధులు మీరిదా ప్రజాస్వామ్యమయ్య
సభ ముగిసెనని స్పీకరు సభను విడచె 79

## 9వ ప్రకరణము

## కూర్మి - కుతంత్రం

ప్రతినిధుల సభ రద్దవ నాజ్ఞనిచ్చె
హక్కు యున్నను బ్రహ్మయ్య యట్లుగాక
తనకు పదవుండ తప్పని తప్పుకొనెను
బలము లేదని సభలోన దెలియబడగ 1

ప్రజల పభ రద్దు కాలేదు ప్రజలు మెచ్చె
సకల పక్షాలు ఎంతైన హర్షమందె
రాష్ట్రపతిపాలనింకను రాదు యనగ
మరల సంకీర్ణ ప్రభుతకై మంతనాలు 2

పుల్లయ్యయు రాజునే గని మ్రొక్కులిడుచు
ఏమి ఓ రాజ మీ యాజ్ఞ ఏమి శలవు
బ్రహ్మయను గద్దె దింపాము ప్రతినబట్టి
పుల్లయయె ముఖ్యమంత్రిగ బలుకరండి 3

ఓయి పుల్లయ్య ఎంత యజ్ఞాని వోయి
పదవి ప్రాధేయ పడినచో వట్టువదునె
పదుగురిల కూడి నిను మెచ్చ పదవి వచ్చు
ముందుపడితివి నీకెంతొ ముప్పు వచ్చు 4

వాపు బలుపులు నొకటన్న భ్రమను వీడు
స్వీయ శక్తిని అంచనా వేసి చూడు
నీదు శత్రువు నెదిరించ నిన్ను జేర
వచ్చు వారెల్ల తేలాలి ఖచ్చితముగ 5

అంత రామయ్య యేతెంచె వంత పాడె
ప్రగతి జనపార్టీ బలమిచ్చి పలుకు ననుచు
సూరయయు వచ్చి పలికెను సూటిగాను
దీన జన పార్టీ బలపరుచు తిరుగులేదు 6

చూడు ఓ రాజ నాకెంతొ తోడు గలదు
మంత్రి వర్గము నడపెడి మంది బలము
శిష్టజన పార్టీ నాకన్న తిరుగులేదు
మీరు యాశీర్వదించిన వెరుగు బలము 7

అంత రాజనె పుల్లయ యందరు విన
బలపరుతు నిన్ను సభలోన భయపడకుము
మంత్రివర్గములో జేర మనసు లేదు
అయ్యలందరు మంత్రులు యగుట హితమె 8

అధిక సంఖ్యన నంతకాలయ్య లిడగ
రాజభవనము జేరెను రాజ్యమేల
బల నిరూపణ కాగానె బాగు యనుచు
ముఖ్యమంత్రిగ పుల్లయ్య నుండమనెను 9

పదవిగొని పుల్లయయు లెస్స పర్యటించ
ప్రజలు పరమాత్ముడనుచును బలికినారు
ఎచట యధికార సంపదల్నరయ గలమొ
అచటహంకార, శీవియు నవతరించు! 10

నీతినియమాల జాడను విలవలేక
జాతి, కులమని పుల్లయ్య కూతబట్టె
బంధుప్రీతిని అవినీతి నందరాదు -
ఇలను రాణించు రాజర్షి ఇందువలనె 11

పేరు ప్రఖ్యాతులొక ప్రక్క పెరుగుచుండ
కుత్రులు దగాలు యొక ప్రక్క గూడు కట్టు
పీటి నెదిరించు ధీప్రజ్ఞ వాటము గను
తనకు లేకున్న పాలన నడుపగలడె 12

సర్వజన క్షేమ మనుచును పలుకు పలికి
బంధుప్రీతికి నవినీతి కందుచున్న
అతని నిక గద్దెదింపాలి ప్రతిన బూని
అనుచు నయ్యలు బ్రహ్మయ నరయ జనిరి! 13

అయ్యలను జూచి బ్రహ్మయ్య హర్షమొంది
చేయి గలిపెను కుట్రను చేరదీయ
కోటలో దూత వారంత కూడి చనిరి
వేడుకొనగను రాజును తోడు పడగ! 14

బ్రహ్మయ్యను జూచి రాజంత పలకరించె
రైతు బాంధవు డరుదెంచె రాజుకొరకు
శుభ శకునమేను మీకెల్ల శుభమదెంతొ
ఎందులకు వచ్చినది మీరు యెరుక పడదు! 15

అంత బ్రహ్మయ్య రాజుతో ననియెనిట్లు
జగతి, మర్యాద జూడ మీ జన్మహక్కు
పుట్టుకతో మీకు యబ్బును గట్టి గుణము
పట్టుబట్టిన మాకది పట్టువడున? 16

చూచిరానాడు లేకున్న లేచి వారు
సభను నేరీతి గగ్గోలు సలిపినారొ
కుట్రునేజేసి కూర్మిని కూల ద్రోసి
సహచరుని మోసగించుట సత్యమేన? 17

కక్ష సాధించ వచ్చితి కత్తి కట్టి
ఆస్థిపాస్తుల నిడినైన జంకు గొనక
చేయి గలపండి నాతోడ స్నేహమనుచు
పొతిపెడతాను వానిని పాపమనక! 18

అంత రాజనె బ్రహ్మయ్య ఎంతవింత
వ్యక్తిగత కోపతాపాలు వద్దుమనకు
బలము కలవానిదే నేడు రాజ్యమయ్య
బాధపడవద్దు పదవొక భ్రాంతి సుమ్ము! 19

రైతు రాజ్యమె కావాలి రాజు వద్దు
కేకలేవేసి నన్నెంతో తాకినారు
మరల యీనాడు మీరంత మాటమార్చి
మరల రాజునె దెచ్చుట మంచిదగున? 20

అనగ బ్రహ్మయ్య రాజుతోననియె నిట్లు
మీరు రాజులు కాదన నేరము గద
పార్టీ అధినేత మాకని పలికినాము
చేయి కలపండి మాతోడ స్నేహమనుచు! 21

కుట్రు పన్నుచు కూర్మిని కూలద్రోసి
పదవి పొందగ మీరంత కదలిరి కద
ముఖ్యమంత్రిగ మీలోన ముఖ్యులెవరో
తెలియ పరచండి నాకును తేటపడగ! 22

అర నిమేషము మెదలక నూరుకొనిరి
బదుగు పుల్లయ కంతటి బ్రహ్మ పదవె?
తమకు గల పరువు ప్రఖ్యాతి తరిగిపోవె?
అనుచు నాత్మను దలపోసి యనిరి యిట్లు! 23

మేము గాకున్న పోయె మాకేమి వద్దు
అల్పులము వేము యధికారమందలేము
పదవి మాలోన నెవరికి చెందకున్న
అన్యులకదందకున్నను అంతె చాలు! 24

అనగ బ్రహ్మయ్యవిన రాజు యనియెనిట్లు
ఏమి బ్రహ్మయ్య మీరీతి ఎంత వింత?
ప్రజల రాజ్యము సాగగ ప్రతిన బట్టి
వంచనతో రాజకీయాలు వద్దు మనకు! 25

మీరిలా చెప్ప మాకిక దారిలేదు
అనుచు నయ్యలు రాజతో మనవి జేయ
కాగలది కాకమానదు కదలరయ్య
యనుచు రాజును దెలిపెను యందరువిన! 26

శిష్టజన పార్టీ బలమవ్వ చెంతనుండ
చీల్చగలనింక పుల్లయ్య చిందులేయ
ననుచు బ్రహ్మయ్య తలపోసె తనదునాత్మ
విస్మరించుతు ప్రజలను "ప్రజల కథను". 27



# 10వ ప్రకరణం

## ఎన్నిక - నూతన నాయకుడు

ముఖ్యమంత్రయి పుల్లయ్య మురిసిపోతు
ప్రతినిధుల సభకూడగ బలకడేమి
బలనిరూపణ కానిదే పాలనేమి
యనుచు ప్రతిపక్షమెల్లరు యరుపులనిడె! 1

పుల్లయయ్యు నంత రాజ్య పాల్ వల్లెయనగ
సభలో బలముంది తనకని సాక్ష్యమివ్వ
చట్టముల సభకూడగ తట్టుకొనగ
జేరె సభలోన సభ్యులాశీను లయిరి! 2

చర్చ కొవసాగ యానాడు యనుమతించి
స్పీకరును సభావేదిక జేరె, నాడు
అయ్యలకు నేమొ దెల్ప పుల్లయ్య లేవ
అడ్డుపడుచును ప్రతిపక్షమంత నిలచె! 3

ఏమి పుల్లయ్య నీ బలమెంత కలదొ
విగ్గు తేలాలి సభలోన నికరముగను
అనగ అధికార పక్షాన మంత్రి లేచి
సభలో "విశ్వాస తీర్మానమనుచు" పెట్టె 4

కర్షకుల పార్టి ఖండించె కర్కశముగ
ప్రగతి జనపార్టీ బలపర్చెజాలననగ
శిష్టజన పార్టి ప్రభుతయే చేరు యనగ
ఓడె "విశ్వాస తీర్మాన" మోట్లు వేయ! 5

ఫలితమును జెప్పి కూలెను ప్రభుతయనుచు
సభ ముగిసెనని స్పీకరు జనియెనంత
సభను అరుపులు ఉత్సాహ సరణి జూచి
పుల్లయయు నంత కోపించి గొల్లుపెట్టె! 6

ఎత్తుగడ పారెనని మీరు ఎగరకండి
శిష్టజన పార్టీ ద్రోహముజేసె మాకు
ఓరి బ్రహ్మయ్య యిరువురం యోడినాము
నాడు నీవంతు, నావంతు నేడు యంతె! 7

ఏమి పుల్లయ్య నీరీతి యెంత వింత
విషమునే పంచియిచ్చిన చేయి నీది
అమృతమును బొంద జూచెడి హక్కు గలదె
విత్తొకటి చెట్టొకటి కాదు వెర్రినాన్న! 8

మోసమ్ము దగాను కుట్రను ముందునిలిపి
శాంతి సఖ్యతలని పాడ సాగరయ్య
పదవియందగ పడరాని పాట్లనెన్నొ
పడితివన్నది తెలియదా ప్రజలకెల్ల ! 9

అంతకన్నను నీవేమి గెంతగలవు
అనుచు పుల్లయ్య బ్రహ్మయ్య వినగబలికె
బ్రతికి నేనుండ నీకిక పదవిరాదు
వచ్చినను అడ్డుపడుచును యరవగలను 10

రాజ్యపాలన కర్తుడు రాజుగారె
పుల్లయయు, బ్రహ్మయలు కారు, పుడమిలోన
మనము తప్పించి యెవరైన మాకు హితమె
అయ్యలిక మంత్రులగుటది యవని కల్ల 11

అంతకన్నను సౌభాగ్యమేమి మాకు
రాజుగారిదె యేనాడు రాజ్యమిలను
అన్యుల కదందకున్నచో యంతె చాలు
అనుచు బ్రహ్మయ్య సభలోన నరిచెనంత! 12

ఏమి రాజన్య మాతీరు యిష్టమైన
అల్పులము మేము రాజ్యాన్ని అందలేము
అనుచు పుల్లయ్య బ్రహ్మయ్య జనగదరికి
రాజు బలికెను నీరీతి రమ్యసరణి! 13

ఒకరు కాదన వేరొక్క రౌననంగ
రాజ్యపాలన జరుగునా రమ్యరీతి
నేడు మీరంత యేకమై నిలచినపుడు
పదవినందగ సిద్ధమే ప్రజల కొరకు! 14

అయ్యలందరు మరునాడు చయ్యన జని
రాజ్యపాల్ విన వారికి రాతలిడిరి
పదవి నందెను రాజును బదిలముగను
ముఖ్యమంత్రియి రాష్ట్రాన్ని ముదము గొలుప! 15

ప్రతినిధులు ఎన్న రాజిట్లు పదవినందె
ప్రజల రాజ్యాన ప్రభువులే ప్రతినిధులన
ఎదరి పక్షము ఓడెను నదియె చాలు
ననుచు, నిరువర్గములవారు నిండ్లకరిగె! 16



# 11వ ప్రకరణం
# సమైక్యత-సమాధానం
## (హితోపదేశము)

రాజ్యపాలన జేకొని రాజుగారు
సభకు నాయకుడయినాడు సభ్యులెన్న
అయ్యలందరు చుట్టును యమరినారు
మంత్రివర్గములో జేర మనసుపడుతు! 1

వచ్చి నిలువగ నయ్యలు వందనమిడి
విరగబడి నవ్వె రాజంత వింత దోప
అయ్యలందరు నాశ్చర్యపడుతు నడిగె
ఏమియో రాజ నీతీరు యెరుక పడదె? 2

నాడు మీరెల్ల నొకటిగా నడచి వచ్చి
గద్దె దిగమని నన్నెంతో కసరినారు
నేడు మీరెల్ల వేరుగా నడచి మరల
పాలనార్హుడు రాజని బలికినారు! 3

ప్రజ్ఞలేనట్టి ప్రజకేల పాలనను చు
నాడు నేనన మీరెల్ల నవ్విరి కద!
మీరె ప్రభువులు రాజపం మీదె యనుచు
నేడు నరుదెంచు మిము జూచి నవ్వు వచ్చె! 4

అయ్యాలంతట నమిత యాశ్చర్యమంది
అడిగిరంతట రాజును కడిగి కడిగి
మేము దయ జూప పదవిని మెదలి నీవు
పరిహాసించుట నవ్వుట భావ్యమేన? 5

అంత రాజనె నయ్యాలు యవుననంగ
ఒకరి బాగును జూచొక రోర్వలేక
ఎదుటి పక్షము వారిని వెక్కిరించ
వచ్చితిరి మీరు దుర్బుద్ధి ఖచ్చితముగ! 6

ఎవరిపై రోసి మీరంత ఎందుకొరకు
పృథ్వి పతిబట్టి నీరీతి మెలగినారొ
తెలిసికొనలేని వాడన! దెలిసెనయ్య?
అయ్యలేరీతి నుందురో యర్థమయ్యె! 7

అనుచు రాజన్యుడీరీతి ననగ వినుచు
రెచ్చిపోయిరి యయ్యలు మచ్చరపడి
నలుగురిలో భేదభావాలు నాడునాటి
నేడు బోధన గావించ నిలచి నావె? 8

అంతగా నరవ బోకండయ్యలార
ప్రజల కథనేల మరచారొ పలకరండి
నైజగుణముల నందిల నడచినారు
తెలివితక్కువ ఎవరిదో తెలిసికొండి! 9

మీలో గల ద్వేషభావము మిన్నుముట్ట
వాడుకొన జూచితిరి మీరెనాడు నన్ను
ప్రజల సేవయె బ్రతుకని పాటపాడి
స్వజన హితమును గోరెడి భజనలేల? 10

విజ్ఞతను బాసి మీరంత పీధిపడుచు
ఈర్ష్య ద్వేషాలలో మీరు యీదులాడి
నలుగు రొకటను పలుకును బలక లేక
తప్పునాదిని యీనాడు దెప్పుటేల? 11

ఎచట సంపద విజ్ఞత ఏకమౌనొ
అచటి కధికారమేగును యవని నిజము
అయ్యలకు రాజ్యపాలన నమరదనుచు
నాడు నేనన మీరంత నవ్విరి కద! 12

రాచరిక వ్యక్తి పొడని రచ్చకెక్కి
ఎవరి యధికారమొద్దని నెగిరి వారొ
మరల యధికార మతనికె యంటుగట్టి
ప్రజల పాలించగలవాడు ప్రభువె యనిరి 13

ప్రజల రాజ్యమె జగతిలో ప్రగతియనుచు
కోటి సూక్తులు పలికిన మేటిపరులె
రామ రాజ్యము స్థాపించు రాజుగారె
అల్పులము మేము యధికారమంద దనిరి 14

పలువురందిన పాలనే ప్రగతి యనుచు
తప్పుకొనుమని ఆనాడు దెప్పినారు
శక్తిగలవాని పాలనే రక్తి యనుచు
పదవి నేనంద భజనలు సలిపినారు 15

ఆనెడి రాజన్యనయ్యలు యడిగినారు
ఈర్ష్య ద్వేషాలలో మేము యీదులాడ
నీవు నీతులు బోధించలేదు నాడు
నేడు, బోధించ నిలిచావు, నీతిదేన ? 16

పుడమి విభుడంత దెల్పెను లోకయుక్తి
బాధ నొందక మనకిల బోధపడునె
''ఎంత హితబోధ జేసిన నేమి ఫలము
భంగ పడనిదె నరుడిల భ్రమను విడడు" 17

గద్దె విడచిన 'మహారాజు' గడపదాటి
జనులలో తాను ఒకడని గడపగాను
గద్దెనందిన అయ్యలు మిద్దెలెక్కి
ప్రజలతో ఘనులమంచును, బలక తగదు 18

ప్రతినిధుల రాజ్యమిది యని బలికి మనము
కొందరె గొప్పవారను టొప్పుగాదు
పలువురెన్నక పాలన పట్టువడున !
ప్రజలు విన ప్రజాస్వామ్యము ప్రజ్వరిలున ! 19

నిజము రాజన్య నీసూక్తి నిజము! నిజము!
వ్యక్తి స్వార్థము వెన్నంటు నక్తముపడి
సాటివారినె ద్వేషించ పోటి పడుతు
వడ్డ దార్లను త్రొక్కాము గడ్డికరచి! 20

అనుచు నయ్యాలు హితబోధ నరసెనంత
"రాజకీయ ముఠాలతో రచ్చకెక్కి
రాజనీతిని నడిపించరాదు" యనుచు
ప్రజలు మాటకు నిలుచుటె ప్రగతి యనుచు 21

అంద రాజనె నయ్యాలు నందరు విన
గొప్పవారును వేతురు తప్పటడుగు
లేనిచో గాథ లిన్నేల నేలజూచు
తప్పె వరిదంటు యిక మీద తడవ వద్దు 22

మనకు తెలిసిన రీతినే మరచి మనము
వేరు రీతిని యెరమారు వెదకినాము
"రాజు రైతను" భావమురాను వద్దు
"కూలి యజమాని" భావము కూడదింక 23

ఐక్యతన్నది మనలోన యమరినప్పుడు
పదుగురొకటను భావము కుదిరినప్పుడు
పదవి వ్యామోహమన్నది వదలినప్పుడు
మేదినిలో ప్రజాస్వామ్యమె మేలుగాంచు 24

పాలనార్హులు రాజర్షులనగ వినుచు
ప్రజలలో వారు లేరని బలకవద్దు
రాగద్వేషాల నందని రమ్యగుణులై
విప్లవాత్మ ప్రజానేత లీ ధరిత్రి. 25



—* సంపూర్ణము *—